మ. కటుకోదండము వంచి రాముఁ డమరుల్ భాసిల్లి దీవింప వి
స్ఫుటనారాచము లూని యార్చి యల రక్షోనాథుపై నేయ
నా, చటులాస్త్రంబులు నింగిముట్టి తగ నాశ్చర్యంబుగా నాటి
యొక్కట నన్నిం బటుచూర్ణమయ్యె దనుజాంగప్రాభవం
బేమొకో. 72

సీ. ఒక్కదివ్యాస్త్ర మత్యుగ్రశరాసనం
బునఁ బూని రఘురాముఁ డొనరనేయ
నది భటునకు నైదు హాయమున కిరువది
కరికిఁ బంధురగతిఁ గలితశతము
సారథి కిన్నూఱు చక్రంబులకు వేయి
పొలుపారు కేతనంబునకు లక్ష
రథికున కఱువదిలక్షలు నై భూమి
యంతయు నిండ నత్యంతశీఘ్రి
గీ. మింతవట్టును దనుజేంద్రుఁ డంతవేగ
నడుమనే త్రుంచి కుపితుఁడై పుడమి వణఁక
రాముపై నేయు బాణపరంపరలును
దక్షణంబున వాలంబు దాఁకి విఱుగు. 73

ఉ. వెండియు దానవేశ్వరుఁడు విం డ్లొకనూఱు కరంబులందు ను
ద్దండతఁ బూని సాయకశతంబు దిశల్ వణఁకంగ నార్చి యు
గ్రుండయి రాముమీఁదఁ బురికొల్పి రయంబున నేసె నేసినన్
దండిగ లోకమెల్ల వివిధస్థితి నిండె మహాగ్ని పెల్లుగన్. 74

శా. అశ్వాండంబులు కొన్ని వాయుజమహోగ్రాభీలవాలం
బొగిం, జక్కం దాఁకి పాతంబునొందె మతిపీఁకం గొన్ని
భూపాలకుం, బ్రక్కల్ ప్రయ్యఁగ దూఁటిపాటె నలివైరం

బొప్పఁగాఁ గొన్ని పెం, పెక్కుల్ వచ్చి విభీషణుం దగిలె
దేవేంద్రాదు లీక్షింపఁగన్. 75

శా. రామక్ష్మాధిపుఁ డందుకుల్ మది మహోగ్రం బొప్పఁగాఁ
గర్కశో, ద్దామాభీలశరంబు లేర్చి గుణముల్ దరోద్వృత్తిల్
మీఁటి సంగ్రామం బందుల రాముఁ డుండవలె లేకల్ దానవుం
డుంటకు, న్నేమం బొప్పఁగ సిద్ధమొందవలె వర్ణింపంగ రెం
డుండునే. 76

మ. అనుచుల్ వింట నమర్చి యార్చి నిజబాహాశక్తి నుంకించి చ
య్యనఁ బెల్లేసినఁ దచ్ఛిలీముఖము లత్యంత ప్రచండాకృతిల్
దనుజాధీశునిగాడి యవ్వల వినోదం బొప్పగాఁ దూఱె వే
గన యచ్చేరువ నున్న కొండపగులంగాఁ దాఁక నుగ్రంబుగన్.

శా. అంతల్ మారుతి చెంత నిల్చి పటురోషాయత్తుఁడై వింట న
త్యంతోగ్రానలబాణముల్ దొడిగియాదైత్యేంద్రు రక్తం బిలం
బంతం బొప్పఁ దొరంగకుండఁ బఱపెల్ బ్రహ్మాదు లాశ్చ
ర్యులై, వింతం జూడఁగ నవ్విభీషణుఁడు హృద్వీథిల్ ముదం
బందుచున్. 78

శా. దానం జేసి స్వదేహరక్త మిల మీఁదం జెందకున్నల్ హరి
ధ్యానం బొప్పఁగ నట్టహాస మొదవల్ దర్పంబుమై నార్చుచుల్
మానంబుల్ చెదరంగఁ దిట్టుచును దుర్మార్గంబునల్ హా పరా
ధీనా యోరివిభీషణా తుని మొదల్ దిక్కేది వీక్షింపరా. 79

మ. అని పెల్లార్చి సమంత్రకంబుగ మహోద్యచ్ఛక్తి సంధించి య
ద్దనుజాధీశకులాపరాధు నిల మీఁదం గూల్చి రక్షించు వై
చిన నంతంతకుఁ జిచ్చు లీనుకొనుచుల్ శీఘ్రింబునం బోయి గ్ర

క్కున బంధించె విభీషణుఁ డా సురవరుల్ ఘోషింపఁగాఁ
జెచ్చెరన్. 80

సీ. అది చూచి రాఘవుం డనలాస్త్రములు వై చెఁ
గంటకుం డగుశతకంఠుమీఁద
నవి ద్రుంచి దానవుం డైంద్రాస్త్రములు వైచె
నవి ద్రుంచి నృపుఁడేసె సమీరశరములు
నవి ద్రుంచి వాయుబాణావళి దనుజుఁ డే
సిన నవి ద్రుంచి యజ్ఞనవరుండు
నారాచతతు లేసె నగుచు నద్దానవ
భర్త రథంబెల్ల భస్మముగను
గీ. విరథుఁడై యంత వేఱొక్కయరద మెక్కి
పృథివి వణఁకంగ విండ్లెక్కు వెట్టఁబూను
నతనిచాపంబులును విశిఖాలివలన
ఖండములుచేసె ఖండనోద్దండుఁ డగుచు. 81

సీ. చాపముల్ పోయినఁ గోపగించి శతాస్యుఁ
డురవడి మండుచు నున్నయట్టి
శూలంబు కరమునఁ జోద్యంబుగాఁ బూని
బ్రహ్మాండమంతయుఁ బగుల నార్చి
శవలుచు జనవల్లభునిఁ జంపు మని యేసె
నేసినజలనిధు లెల్ల నింకెఁ
గులగిరు లదరె దిక్కులు వ్రయ్యలగుచుండె
నింద్రాదు లద్భుతహృదయులైరి
గీ. యంత నదిదాని విలయకాలాగ్నిరీతి
మండుచునురాఁగ నాహనుమంతుఁ డపుడు

వాల మల్లార్చి వచ్చెడికోల ముగ్ర
వృత్తి వెసఁబట్టి నడిమికి విఱుచుచుండె. 82

సీ. హనుమంతుఁ డందుచే నదవదపడుచుండ
నిది సమయము రాము నిలనుగూల్ప
ననిరొక్కగదతోడ నడిచె తీవ్రవ దాని
కాఁకున కొక్కింత తల్లడిల్లి
మనుజవల్లభుఁ డాత్మఁ గనలుచు నర్ధచం
ద్రాస్త్రశతంబు శరాసనమున
సంధించి దేవతాసముదయంబులభక్తి
యొనర నాపైఁ గల్గియుండెనేని

గీ. వానిహస్తంబులును దలల్ వసుధఁ గూలుఁ
గాక యని వైచె దైత్యుండు గళవలింప
నమరు లద్భుతమంది హాహా యనంగ
ఖండమై కూలెఁ దలలును గరశతమును. 83.

సీ. కూలి క్రమ్మఱఁ దొంటిపోలిక మొలచెను
గరములుఁ దలలు నక్కజముగాఁగ
నాశకాస్యునిరక్త మవనిపైఁ దొరఁగిన
మొనసి నూర్వురు శతముఖులుపుట్టి
యొక్కడఁ జూచిన నక్కడ నటువంటి
వికృతదైత్యులు వెల్లివిరిసియుండ
నన్ని దిక్కులఁ బోర నందుకు రఘురాముఁ
డందరఁ బోరుచు నడలుచుండ

గీ. నంత హనుమంతుఁ డాకోల ముపుడు ద్రుంచి
సీత నెక్కడఁ దగులునో శితశరమ్ము

లనుచు వాలమ్ము చుట్టిరాఁ దిగిచియుండె
నగుచు సుర లుబ్బఁగా మేరునగమురీతి. 84

ఉ. రావణకుంభకర్ణుల శిరంబులఁ గూల్చితి నంచు మమ్ము దు
ర్భావమునం జెనంగ వెసఁ బాల్పడి తెందుల కేగువాఁడ వీ
వేవిధినైన నిన్నుఁ దునియించి భవత్తనుమాంసఖండముల్
వావిరిమై భుజింతు మిఁక వార్ధులు సొచ్చినఁ బోవనిత్తుమే. 85

గీ. కొండ చెట్లని తిట్టుచుఁ గొండ అలిగి
సాయకంబులఁ గప్పుచు శౌర్యమహిమ
చూడు మనుచును నెక్కుడఁ జూచినను శ
తాస్యమయమయ్యె నట సుర లకట యనఁగ. 86

గీ. అపుడు నిర్విణ్ణుఁడై చాప మచట వైచి
చేతులాడక మిగుల నిశ్చేష్టుఁ డగుచు
నవ్విభీషణు నీక్షింప నతఁడు శక్తి
బద్ధుఁడై యున్నఁ బవనజుఁ బాఱఁ జూచి. 87

శా. ఏచందంబున గెల్చువాఁడ నిఁక నే నేలాగునం ద్రుంతు నీ
నీచాత్ముం డెచటం గనుంగొనినఁ దా నేయున్నవాఁ డేగతిన్
భూచక్రంబున నెత్తెఱంగు మునులం బోషింప నేలాగునన్
నాచేతన్ మనఁగోరువారు నెప మొందన్ హేతువయ్యెంగదా.

వ. అని యనేకప్రకారంబుల విచారింప నారఘుపుంగవునిం గనుం
గొని యాంజనేయుండు నిర్విణ్ణుఁడై యూరకుండె సకలబల
క్షీణంబైనమనము మరలి వార్ధిచతుష్టయంబు నెట్లు గడ
తుము పుత్రపౌత్రానుజవియోగంబున నెట్లు నిలుతుము
ఈదుర్వార్త మాముగ్గు రమ్మల కే మని వినిపింతు నీపరము
పలితుం డైననిశాచరుని సర్వశస్త్రాస్త్రంబులవలన సంహరింపం

బాలక బలక్షీణంబై యుంటి నింక నేది యుపాయం బనిన
మారుతనందనుండు రామచంద్రుని పరాజయంబునకుం
జింతించి యూరకుండె నప్పుడు మగనివగపుఁ గనుంగొని సీతా
మహాదేవి తనయాదిమరూపమహిమాసామర్థ్యంబు తలపోసి
తనచేత నంతయు సాధ్యం బగుట సిద్ధంబుగాఁ దెలిసి కరం
బులు మొగిడ్చి రఘుకులసుధార్ణవసంపూర్ణిమాచంద్ర మదీ
యప్రాణనాథ రఘునాథ భవన్మహిమంబునఁ గొంతసేపు నేను
మీచేతివిల్లును బాణంబులును బూని రిపులతోడఁ బోరెద
నాఁడు దాన నని యాగ్రహంబు సేయం దగ దిట్టిసమయం
బున మీకు నలయిక దీఱుదనుకను దివిరి వివిధవిశిఖపరంపర
లచేఁ బెనంగెద నావిన్నపం బాకర్ణింపు మని పెక్కుచందం
బులఁ బ్రార్థింప రామభద్రుండును దనమనంబున నద్భుతంబు
నొంది మున్ను దనతోడ వసిష్ఠుం డెఱింగించుటయును
జానకి తన్ను సెలవు దయచేయు మని వేఁడుటయును మొదట
విరించిఁ గోరునెడ స్త్రీలఁ దలఁపకుండుటయు ననేక ప్రకా
రంబులఁ దలపోసి దనుజుండు మడియుట సిద్ధం బని మనంబునం
దోఁచిన నలరి బాణాసన బాణతూణీరంబులు దీవించి యొసం
గిన నవ్వేళ నవ్విమలాంగియును బరంజ్యోతిస్వరూపంబు
గైకొని హనుమంతునిభుజంబుపై మిన్నుముట్ట నిలిచి తన
మహాతేజంబు భూనభోంతరాళంబు పరిపూర్ణంబుగా నిండ
మహోద్దండకోదండం బెక్కిడి సకలబ్రహ్మాండభాండంబులు
ఘూర్ణిల్ల గుణటంకారంబులు గావించి తనమహామాయ
నాకర్షించిన నది వాడచూపిన నీవు దనుజుని రక్తబిందువగం
బరలు ధరం దొరంగక యుండ నెవ్వరికి నదృశ్యంబవై నాలుక

ఱెటు చూచిన యోజనంబు నేలఁ బఱపియుండ మునినియో
గించిన రాఘవుం డాశ్చర్యమానసుండై చూచుచుండ
నమోఘబాణపరంపర నిగుడించి శతముఖుల నందఱ నొక్క
దిక్కునకు వాయవ్యాస్త్రంబులం ద్రోయుచు మహోద్దండ
ప్రచండభండనంబు గావించిన సద్దానవనాయకనిచయంబును
దదీయతేజోవిశేషంబువలనఁ జేతులాడక చూచికొనుచుండి
రాసమయంబున. 89

గీ. విల్లు జళిపించి కర్కశభల్లశతము
పూని దేవతలెల్ల నద్భుతమునొందఁ
బ్రహ్మాండంబు పటపటఁ బగుల నార్చి
కొలమిఁ దనపతి వినుచుండ నిట్టు లనియె. 90

[1]గీ. మాఁదుమార్తులకును నేనె మూలదుంప
నగుదు నేని శ్రుతుల్ సత్య మగున యేని
పుడమి నిజశతకంఠుఁ డొక్కఁడును దక్క
నున్న శతముఖహీనమై యుండుఁగాక. 91

---

[1]గీ. మాఁదుమార్తుల కొండటి యామూర్తి నేను
వేదములు నిక్కమైన నీనిఖిలపృథ్వి
నిజము యగునేని నా దగుపెద్దిశరము
లను శతాస్యంతు ధరఁ గ్రుంగ నమును జేసె.

గీ. అశరంబు మహోగ్రానలాంశకరణి
ధరణి బగలఁగ మంటలు దిరుగఁ బెరుఁగఁ
జిచ్చు పెచ్చున మిన్నంటు చిచ్చులమిడి
మాడుకొను బాణబాహువు నాశకాయ.

గీ. అనుచు వైచిన నందఱ సాతఁ బెంబ
నీటుగావింప మాయమై పోరు మాని
చనిరి వెండియు దానవచక్రవర్తి
సీతపై నేసె నుద్దండశితశరములు. 92

గీ. ఇవ్విధంబునఁ దనరక్తమిలను దొరఁగి
యందుఁ బుట్టినశతముఖు లణఁగ నందు
వలన నిది మాయ గాఁబోలు వనితయైన
నిట్టితెఱఁగునఁ బోదు రే పెట్టిదముగ. 93

గీ. అనుచుఁ గ్రమ్మఱ జానకి నరయుచుండ
విష్ణుఁడును బ్రహ్మయును నలవిశ్వపతియు
విలయపావకుఁడును మహావిధియుఁ గానఁ
బడిన నదిచూచి మది భయపడిరొ నసుర. 94

---

గీ. అటులం వచ్చినబాణాగ్ని కాఁగలేక
నీరుగావింప మాయమై పోరు మాని
చనిరి తమతమయింద్లకు సైఁపలేక|
బ్రదికియుండిన సౌఖ్యము లబ్బెదయనచ్చు.

వ అనుచు రాక్షసేంద్రుని చేత బాణాగ్నిజ్వాలలు గ్రమ్ముకొని జామ్మని వచ్చు చున్నయవి ధరింప శివ్వ రోషుడురు ఇతనిచెం దగుఁగాక యని విడిచిరి యుద్వృత్తు తదగ్నిజ్వాలామాలికల కెదురుపడి తిరిగి వెలుఁగు జొక్కవారు గాత్రంబు బాధించి చేసెఁ దదగ్నిచలంతం బొందిరమీఁదటఁ దా నొక్క రుండై యాదానవచక్రవర్తి జనకజం గాంచి యుద్దండశరవర్షధారలు గురి పించిన.

క. శరవర్షధార లన్నిటిఁ, బరిమారిచె జొక్కబాణజదగ్నిముఖ
త్వరితగతి రౌద్రబాణము, శరము సాధించి చేసె శతకంఠునిమీఁదన్. (?)

ఉ. రామునివేరిబాణముల రాక్షసనాయకుమీఁద నార్చి యా
రాము చెలంగి వైచిన నరాతిభయంకరమై కణంకతో
వేమఱుఁ బోయి దానవునివిం డ్లొగిఁ ద్రుంచి కిరీటపంక్తులన్
భీమము మీఱ డుల్చి సరిపెట్టెఁ దదీయశరీరతేజమున్. 95

ఉ. ఎచ్చటఁ జూడ నచ్చటనె యొప్పిని మృత్యువుఁ బోలి సీత దా
మచ్చర మొప్ప నిల్చి తనుమార్గణపంక్తుల నొంపఁ బూనఁ దా
నచ్చెరువంది యాహరిహరాదులకైన వశంబు గాదుగాఁ
జెచ్చెర నిమ్మహామహిమచేఁ దనకున్ మరణంబు చొప్పడున్.

చ. అనుచు రథంబుపై నిలువ నద్దనుజాధిపుమీఁద నల్కపై
ననలశిలీముఖంబులు సహస్రశతంబులు వైచె వైచినన్
దనుజుఁడు సొమ్మసిల్లి యరదంబున మూర్ఛిలి వ్రాలె వ్రాలినన్
గనుఁగొని సూతుఁడున్ రథము గ్రక్కునఁదోలె రణంబు
పాయఁగన్. 97

వ. శ్రీరామచంద్రుండు సీతామహత్త్వంబు గనుంగొని తన
మనంబున. 98

సీ. పుష్పంబు లఱచేతఁ బూననేరనిచెలి
యిషుపరంపరఁ బూన నెట్లునేర్చెఁ
జిల్కపల్కులకు బిట్టులుక్కుకోమలి యిల
యొల్ల భీతిల నార్వ నెట్లునేర్చె
నేఁ దక్క నన్యుల నీక్షింపనేరని
యింతి సేనలఁ గూల్ప నెట్లునేర్చె
విసవిస నడువంగ నసియాడుకొమ్మ నేఁ
డడసి యుద్ధముసేయ నెట్లునేర్చె

గీ. ననుచు రాఘవుఁ డద్భుతవార్ష వార్ధి
నోలలాడుచు హనుమంతుచాలమహిమ
వినుతిసేయుచు నాతనివీఁపుమీఁద
నుండె జానకిపైఁ బ్రేమ నిండుకొనఁగ. 99

శా. ఆంతట దానవుండును రయంబున మూర్చఁదేఱి సారథిఁ
వింతగఁ జూచి యోరి పరవీరులు నవ్వ రథంబుఁ దెత్తురే
యెంతటివారలైనఁ బరమేష్ఠి యొసంగిన యవ్వరంబుచే
నింతయు నస్రైంకఁగలరే మహిఁ గూలుదు రింతె కాకొగిన్.

వ. అన విని సూతుఁ డిట్లనియె నక్కటా నాథుఁడు దండలేచిచో
ఘనవిశిఖంబులన్ మనల గ్రక్కున శల్యము లుచ్చిపాఱఁగాఁ
గనలుచు నేయుజానకిని గాంచి సురల్ వినుతింప నట్టిచో
దనుజకులాధినాయక రథంబు మఱల్పక యుంట ధర్మమే.

వ. అదియునుంగాక. 102

చ. వెఱచినయట్టివేళ మఱీవింతగఁ గైదువు చక్కఁ బూనఁగా
మఱచినయట్టివేళఁ బలుమాఱు నరాతికి వెన్నుఁ జూపుచుం
బఱచినయట్టివేళ నగుబాటు ఘటింపఁగఁ జేరి పూరిఁ దాఁ
గఱచినవేళలందు నెడగల్గ రథంబు మఱల్చు టొప్పగున్. -

చ. అనుడు తదీయనీతివచనాలికి సుత్సవమంది వానికిన్
ఘనతర నసేకవస్తువులు గ్రక్కున మక్కువ నిచ్చి నేఁటి కా
జనకజతోడఁ బోరుటకు శక్యముగా దటుగాన రేపు స
య్యన నరుదెంచి రాముని శరావళిచే నణఁగింతు వేగనన్.

ఉ. భోరునఁ బోవనిమ్ము మనభూరిరథంబు గృహంబు చేరఁగా
నారఘురాముదేవి విను మల్లదె చంపఁగఁ బూనివచ్చె నా

క్రూరశిలీముఖంబు లలకోమలిపైఁ బని సేయ పెట్టుగాఁ
గారణమున్న దో యనుచుఁగుందుచు సేగశతాస్యు డింటికిన్.

శా. ఆరీతిన్ శతకంధరుండు దనగేహం బొప్పఁగాఁ జేరి యా
కారం బెల్లను జూచి భీతి నతిదుఃఖప్రాప్తుఁడై మీఱి సొం
పారన్ జానకి మృత్యువై దగుమహోగ్రాగ్నేయ బాణంబునన్
వైరం బొప్పఁగ వైచెనో యనుచు గర్వం బెల్లఁ దూలన్ వెసన్.

వ. మఱియు ననేకమార్గంబుల జానకి దివ్యతేజోమహిమంబును శరంబులవేగంబును బాణసంధానచాతుర్యంబును ఉప సంహారచమత్కృతియును నుగ్గడించుచు నెక్కడఁ గనుఁ గొన్న నక్కడఁ బరంజ్యోతిస్వరూపం బగుసీత గనఁబడిన భీతిల్లుచుఁ దనకు నింక మరణంబు సిద్ధం బని నిశ్చయించుచు సెజ్జపయిం బొరలుచుండుతనయుని విలోకించి తల్లి యగు చిత్రగంధి దగ్గఱి తనకరంబునఁ దద్గాత్రంబు నివిరి రక్తప్లుత నిమ్నోన్నతంబులై యపరిమితశరంబులు నాటి యందు విఱిగియున్నఁ గనుంగొని విలపించి యిట్లనియె. [అయ్యా నెయ్యంబున నేఁబలుకువచనంబులు వీనులం జొరనియ్యక యింతచేసికొంటివి. ఆయమ్మ యెక్కడ నలుగు నక్కడ నిర్మా

[ ] ఈయుద్ధభాగము సీసముగా నున్నది.

సీ. రామునితో సంగరంబున కీవు పోవద్దని చెప్పిన బుద్ధి లేక
వైరంబు గావించి వసుమతీసుతతోడఁ గలహంబుచేసి తత్కారణముగ
నామహావిభుఁడౌ యాదిపరంజ్యోతి నిఖిలజగన్మాత నిర్మలాంగి
యెక్కడ నర్గిన నక్కడ నిర్మూల మైపోవు నెక్కడ నేఁపుమీఱ

గీ. నెక్కడైనను గరుణింప నక్కజముగ, సిరులు వర్ధిల్లు నామహాసీతవలన
బ్రహ్మరుద్రామరేంద్రులు భాసురముగ, దగఁ బ్రకాశింపఁజేరరు దానమేంద్ర.

లంబగు. ఎక్కడఁ గరుణించిన నక్కడఁ గళ్యాణపరంపరాభి
వృద్ధియగు. అప్పరంజ్యోతిమాయకు బ్రహ్మరుద్రేంద్రులు
లోనైకాని వెలిరై ప్రకాశింపనేరరు] భూనభశ్శైలసముద్రా
ద్యపారస్థావరంబులును మృగాండజోరగపిపీలికాద్యసంఖ్య
జంగమంబులును గలుగు బ్రహ్మాండంబులు నూఱుకోట్లు
పుట్టుచు గిట్టుచు నమ్మహాశక్తియందు నటించు. ఆదిమధ్యవిల
యంబులు నమ్మహామహిమంబునకుఁ గనఁబడవు. నీకు మొదట
విరించి పురుషులచేఁ జావులేకుండ వరంబు లొసంగునపుడు
దేవతలు గినిసి యిట్టివరంబు లొసంగిన నద్దానవుండు లోకం
బుల బాధపెట్టు నింతవత్సలత నీకుం దగదనిదూఱిన నతండు
లజ్జించి శతముఖుండు పురుషులం దడవెనెకాని తరుణులఁ
దలంపఁ డటుగాన మిమ్మును గోబ్రాహ్మణుల నెప్పుడు చెనంకు
నప్పుడే జానకీదేవి తనతొంటిదివ్యరూపంబున వధించు నిందు
లకు సందియంబు లేదని పలికె నదిగావున సీతయుఁ జిద్రూపం
బగుమాయగాని సామాన్యకన్యకగాదు. ఇట్టిచందంబున
నమ్మగువచే భవన్నాశంబు సత్యంబు నమ్ముము. అసురలును
విరించి పల్కినపల్కులకు నానందహృదయులై యుండిరి. ఇట్టి
యమ్మహాశక్తి నెదురం జని చరణారవిందంబుల కెరఁగి నమ
స్కరించి మమ్మును బుత్రమిత్రకళత్రములను మనుపంజాలెద
వేని సీతారాములకు శరణుచొచ్చి తలిదండ్రులు మీరు
మీరు దప్ప మాకు నితరులు లేరు రక్షింపు మనిపలికి సకల
భోగంబులం దేలుచు బ్రతుకు మని పెక్కుచందంబులఁ బలి
కిన నప్పలుకులు ములుకులచందంబునఁ గర్ణరంధ్రంబులు
సోఁకిన నులికిపడి తల్లితో ని ట్లనియె. 107

సీ. ఏ వల్గినచూచిన నిసుఁడు బెట్టిదముగాఁ
బూని యొండలుగాయఁ బోదల వెఱచు
వలసినప్పుడె కాని మలసి యొచ్చుటనైనఁ
జెలరేఁగి యనలంబు మెలఁగ వెఱచు
నాకు భృత్యులరీతి నాకులందఱుఁ గను
సన్నలఁ బనులెల్లఁ జరుపుచుండు
రథలజీవుల నేర్పుయముఁడు నాముందఱఁ
గోలకాఁడై యుండు వేళయెఱిఁగి

గీ. మృత్యువున కేను మృత్యువై మెఱయుచుండు
మఱియు నాయందుఁగల మహామహిమ. శివున
కైనఁ జొప్పడ దట్టి నరాధముండు
నతివయును గెల్వఁగలరె యే నఱతుఁగాక. 108

గీ. రేపు చని శాత్రవులనెల్ల నేపు మాపి
వత్తుఁగా కొందువార్తలు వలవ దుడుగు
మీ యటంచును దనతల్లి నింటి కనిచి
నెలఁతయును దాను నారేయి నిద్రచెందె. 109

సీ. అక్కడ రఘురాముఁ డనుజాలుఁ దనయులు
పోరిడిఁ గూలినఁ జూచి శోకమంది
యేకుని చననేర్తు నింటికి వీరల
నెచ్చోటఁ బొడఁగందు నెప్పటట్లు
కుశుఁ డెన్నఁటికి నన్నుఁ గొమరొప్ప వీక్షించి
వేడుకఁ బ్రతిభాష లాడుచుండు
లవుఁ డెన్నటికిఁ గల్గు లక్షణవంతుండు
బాలుఁడు నామీఁదఁ బ్రాణపదము

గీ. అనుచు నొఱలంగ సీత నాయకునిఁ జూచి
యేడసోదరు లధికుల కేడ సుతులు
రణగతులు మాని యిట్లొఱలంగఁ దగునె
అనఘ సంసారములు మాయ లనఁగ వినవె. 110

సీ. *అనుచుఁ దానును రాముఁ డాహనుమంతుండు
నవ్విభీషణుకడ కరిగి యతఁడు

---

*సీ. ఆజానకీసతిని జూచి యారామచంద్రుఁడు
పుత్రమోహముచేతఁ బొదలి పొదలి
హా తమ్ములార యాహా పుత్రవరులార
రారోయి ననుఁ జూడ రాజసమున
మనతల్లులకు నేమి మనసారఁ జెప్పుదు
నేలాగు తాళుదు నేమిచేతు
దిక్కెవ్వరు లేరు నొక్కఁడ నైయుంట
దిక్కుగాఁ జూడరో దిక్కులందు
గీ. ఘనము మిముఁబాసి నేఁడాశఁజాల నహహ
సంభ్రమము మీఱ మీ తోడ సాగరములు
దాల్గ నవలీలఁ జనుదెంచినాఁడ నిపుడు
కొంటినైయుంటి నన్నుఁ జూడుఁ డంచు నడలె.
గీ. తగదు శ్రీరామచంద్ర సద్ధైర్యధుర్య
శౌర్యగాంభీర్యములు మాని సంగరమున
జాలిపడ సాహసంబునఁ జేలు టొప్పు
ననుచుఁ దెల్పిన ధైర్యంబు నందుకొనుచు.
వ. మఱియుఁ గొండొకసేపు విచారించి ధైర్యావలంబకప్రాభవుండై తన్మనంబున
జానకి ధైర్యస్థితిగతులు గనుంగొనుచుండె నప్పుడు.

మము నమ్మివచ్చి యిమ్మాడ్కి నిబద్ధుఁడై
యున్నాఁడు రక్షింపకున్న దోష
మని శక్తి శరమున నలుకమై ఖండించి
మొనసి యాతఁడు చెందుమార్గ్గఁ దెలిపెఁ
దెలిపిన నతఁడును ధీరాత్ముఁడై లేచి
వారికోమలపద వారిజములఁ

గీ. బడిన దీవించి యతనితోఁ బ్రథనభూమి
చూడవలె నని దివటీలు సొరిదిఁ బూని
కపులఁ జూచుచు నంతంతఁ గదలుచుండఁ
బరఁగ భల్లూకపతి గానఁబడియె నచట. 111

సీ. అతని డాసి రామానుమతంబునఁ
బవనజుఁ డల్లనఁ బలుకరించె
జాంబవంతుఁడ నన్ను సరవిమై నెఱుఁగు దే.
యొప్పుడే లేచి రానొక్క దెసకు
నావిని మారుతనందనుం డీతఁడు
గాఁబోలు నని ధృతి కలిగి తెలిసి
హనుమంత రమ్ము రామావనీనాథుం డు
పరిణామమునఁ దనభామతోడ

గీ. నున్న వాఁడె విభీషణుఁ డున్న వాఁడె
బ్రతికియున్నాఁడె పవనజ భానుసుతుఁడు
పరమబంధుండ వగు నీవు పలుకరించి
నపుడె బ్రతికితి నీకృపఁ గపివరేణ్య. 112

సీ. కన్నులశరములు గాఁడి యొక్కింతయుఁ
దెలియ శక్యముగావు తెలివిపడవు

పీనులు వినరావు వివశత్వ మొందవెదు
దేహాంబు మరణసందేహమునను
లోలమై పలుక నాలుకరాదు నోటను
దడిలేదు లేచినం బడుదు మరలఁ
గావున శరములు గాఁడియున్న వి మేన
నన్నియుఁ దివియుమా యన్న యనిన
గీ. రాముఁ డన్నియుఁ దీసి శరంబులందు
దేహ మెల్లను నివిరి చింతింపనేల
నేను రాముఁడ నన లేచి నృపునిపాద
వనజములమీఁద నందంద వ్రాలి తెలిసె. 113

వ. మఱియుం బరికించుచుఁ జనియెడుసమయంబున. 114

సీ. కొండలవలె నేలఁ గూలినమదగజ
ఘనకదంబములు మేఘములుగాఁగ
మోఁకాలిబంటితో నేకమై యాడాడఁ
గనుపట్టు మెదడు పంకంబుగాఁగ
నలుగులతాఁకున నిలఁబడుమాంసఖం
డములు దామిం ద్రగోపములుగాఁగ
బలువిడి నెడనెడఁ బాఱెడిర క్తంబు
లంబుప్లుత ప్రవాహంబుగాఁగ
గీ. వాహినులగుంపు శరముల వానగాఁగ
మెఱన లహాంకృతు లవి యుఱుములును గాఁగ
వర్ష కాలంబుచాడ్పున వారికన్ను
గవలకును దోఁచె నప్పు డక్కజముగాను. 115

ఉ. అంతటఁ దెల్లవాఱె విలయాంతకుఁడై పడి నాళకాస్యుఁ డ
త్యంతపరాక్రమంబున మహోగ్రమహాఁ దోచు రథంబుమీఁదని
శ్చింతగ నెక్కి బాణములు చేకొని దుశ్శకునంబు లట్టిచో
నంతకు నంతకుం బొడము నన్నియుఁ గైకొనకున్న నంతటన్.

ఉ. ప్రొద్దున లేచి తల్లి తనప్రోలికి వచ్చి కుమారరత్నమూ
ముద్దులుగూర్చి ప్రేమమున మోమును వీక్షణచేసి నేటికీ
వద్దుర మాను దుశ్శకునవారము పుట్టె నటంచుఁ జెప్పఁగాఁ
బెద్దరయిలుంగు నెత్తి భువిఁ జెల్లుగ నార్చి తొలంగఁ ద్రోచినన్.

వ. అంతట నద్దంబు వడి యతనిభార్య యగుయయాతి కుమారుం
డగునీలకేతనుం దోడ్కొనివచ్చి నీతల్లి చిత్రగంధిబుద్ధులకు
సహింపఁజాలక తొలఁగం ద్రోచితి విదియేమికారణం బోకో
యని తననాథుపాదంబుల కొరఁగి నీకుమారుం డగునీలకేత
నుండు వచ్చియున్నాఁడు నన్నుం గృపఁజూచి నామాట
లాలించి యిప్పుడు రణయాత్రకు సమయంబుగాదు మాను
మని చెప్పిన వినంజాలక తనయుని గారవించి రాముని
జయించి జానకీసహితంబుగా నేతెంతు నందాఁక నీలంక
నిశ్శంకంబుగా నుండు మని చెప్పినఁ గుమారుం డామాట
లకు సందేహంబు నొంది రాయి రామచంద్రుండు సర్వ
దేవాసురులకు నజేయుండు అదియునుంగాక పూర్వంబున
రావణాంతం బెఱుంగవె! నీవెంత! దుష్టవరంబు వేఁడినంగాని
నీకు నజేయుండుగాని నీచే రణమరణావస్థనొందఁడు. ఇతని
సతి మహావీరపతివ్రతాచారిణి. కళ్యాణి యగుసీతామహా
దేవిచే వశింపంగలవాఁడవు. ఇది పూర్వంబున మీతల్లిచే
వింటిని నాఁటనుండి నీదురాచారంబు లెవ్వరిం జేరునో యని

చింతించుచుంటి నదినిమి త్తంబున సీతారాములు చను దెంచి సమ స్తసేనలం బరిమార్చిరి. నీవొక్కరుండవు నమ్మహాశ క్తిని జయింపలేవు. రణయాత్ర మాని మన్మాదరించి సకలభోగం బులం దేలు మని చెప్పిన విని యోరీ! పితృద్రోహంబునకుం బాలుపడి దురాలాపంబు లేల్లాడ నోరాడె నని కుమారునిం గదిసి కోపారుణితలోచనుండై యయాతిని నెడఁద్రోచి కుమారు నదలించి సకలశరంబులుం గైకొని వచ్చి నిచ్చట.

ఉ. వచ్చిన దైత్యుఁ జూచి నృపవర్యుఁడు తన్మదిలోనఁగుంది యా చిచ్చులమంటకై వడిని జేరెను వీనిపరాక్రమంబుకుఁ సచ్చరితంబు భాగ్య మది సంఘటనం బెపుడైనఁ గల్గునో విచ్చలవీఁగి వీని రణవీథిని నెట్టులు గూల్చు సీతయున్. 119

వ. అని సీతం జూచి మధురవచనరచనాలాలిత్యంబును నవలో కించుచు నుండె నంత దానవేంద్రుండు బాణపరంపరాభివృద్ధి యొనర్చి విజృంభించి రణోత్సాహియై జానకిం గదిసి మెఱసె.

ఉ. సీతయు విల్లు నమ్ములును జేకొని రాఘవు నాజ్ఞఁ బూని వి ఖ్యాతపరాక్రమంబున మహాహవదీక్ష వహించి యామరు జ్జాతుభుజంబుల న్నిలిచె జానకిచెంతను రామచంద్రుఁడుం బ్రీతిదలిర్ప నుండెను విభీషణుఁడుం జనె వారిపొంతకున్.

చ. అపుడు సమ స్తలోకములు వచ్చెరు వందెఁ గృశించె దానవుం డపుడు పయోనిధుల్ గలఁగె నప్పుడు పర్వతముల్ చలించె నా, రఘునిమృత్యు వచ్చటఁ బరామరిసించుచు నుండె బ్రహ్మ యుం, గుపితమనస్కుఁడయ్యె నదిగో విలయం బని మాటి మాటికిన్. 122

ఉ. సర్వసుపర్వులుం సకలచారణులుం వరకిన్న రేంద్రగం
ధర్వులు సిద్ధసాధ్యులు ముదంబున నభ్రమునుండి వారిదో
ద్గర్వము బాణనైపుణియు గాఢతరప్రతిభాషలుం దయా
ఖర్వమనస్కులై నిలిచి కన్గొనుచుండిరి యద్భుతంబుగన్.

ఉ. జానకి వారిఁ జూచి దనుజప్రభుఁ ద్రుంపఁ దృణంబు నాకు ని
ద్దానవనాథుతోడ వివిధస్థితిఁ బోరఁగఁ జూడఁగోరి ఖ
స్థానమున న్నిలింపులు విశాలత నల్లదె యున్నవారు నేఁ
బూని తదీయచిత్తములు పొంగఁగఁ బోరెదఁ జిత్రవైఖరిన్.

చ. అని శరసంఘమేయ దనుజాధిపుఁ డన్ని శిలీముఖంబులం
దునియఁగ సేసి వాయుజునిదుష్టతరాగ్రహవృత్తిఁ జూచి యీ
వనచరుఁ జంపినం మనుజవల్లభుఁడుం సతియు న్నశింతు రౌ
య్యన నిజమంచు నిష్ఠురమహాస్త్రము లేర్చి శరాసనంబునన్.

ఉ. ఇగ్గతి బాణముల్ దొడిగి రుష్మ దలిర్పఁగ నార్పుచుం సుధా
భుగ్గణమెల్ల నద్భుతమునొందుచుఁ జూడఁగ నేసె నేసినం
దిగ్గున సీత చూచి యతితీవ్రశరంబుల వానినెల్లఁ దా
నగ్గలమైనకోపమున నల్లనఁ ద్రెవ్వఁగ నేసె నుగ్రతన్. 126

ఉ. అందులకుం మహాద్భుతమునందుచు శాతశిలీముఖంబులం
గ్రందుకొనంగ జానకిని గ్రక్కున నేసిన నెల్లదేవతా
బృందము లుత్సహింప నతిభీషణబాణపరంపరంబుచే [గన్.
ముందుగఁ ద్రుంచెదచ్ఛరసమూహముల న్రఘురాముఁడుబ్బఁ

చ. అవియునుగాక ఘోరవిశిఖావళి వింట నమర్చి యార్చి పే
ర్చి వికృతదైత్యనాయకుకిరీటములుం బటుచాపముల్ కడుం
భువిఁ బడనేసి చండతరభోగిశరంబుల వానితేజము
గ్రవిధి నణంగఁజేసె నతిగాఢతరప్రతిశౌర్యకోపయై. 128

ఉ. చాపములుం గిరీటములుఁ జాలశరీరవిశాలతేజముల్
ఏపును బోయినన్ రఘుకులేంద్రుని దేవిరయిల్ మహాహవా
టోపగదాచయంబును గదల్ వడి ఋవ్విన నగ్గదాళి ను
ద్దీపితసాయకంబుల ధృతిం దొడిచేసె సురల్ నుతింపఁగన్. 129

వ. మఱియు దర్పంబున. 130

ఉ. అంతటిలోన సీత విలయానలకీలయపోలె నాత్మలో
నెంతయు రోషమెత్తి దనుజేంద్రశిరంబులు గూలఁగావుతన్
వింతగ నంచు నేసె నొకవిష్ణుశరంబున నేయ నెల్లరా
ప్రాంతములందుఁ దిక్కటిల నగ్నిపరంపర లీనుచున్ వడిన్.

చ. చని శతకంధరుం దలలు చయ్యనఁ ద్రుంచి తదీయహస్తముల్
తునియలు చేసివచ్చె నటుతోడనె తచ్ఛిరముల్ కరంబులున్
ఘనతరలీల మొల్చె నవిగాంచి ధరాసుత వెండియున్ రయం
బునఁ బడనేసె నప్పటికి బోరున మొల్చెను మస్తహస్తముల్.

ఉ. ఎప్పుడు విల్లుఁ బూనునొకొ యెప్పుడు నిక్కుచు నెక్కు
పెట్టునో, యెప్పుడు తూణమందునొకొ యెప్పుడు బాణము
లేర్పరించునో, యెప్పుడు పూనునో శిరము లెప్పుడు ద్రుం
చునో యెప్పు డాతలల్, గుప్పున మొల్చునో యనుచుఁ
గోరి సురల్ గనుచుండి రద్దివిన్. 133

క. నక్తంచరలోకేంద్రుని
రక్తము నిలమీఁదటను దొరంగకయుండన్
యుక్తముగ నపుడు మాయా
శక్తి వెసం ద్రావుచుండెఁ జయ్యన నడుమన్. 134

క. ఇవ్విధమునఁ బోరాడఁగ
నవ్విమలశరీరి జనకజాత్మజ జూడన్

మున్వేముగ నణఁడు రుద్రుఁడు
నవ్వుచు దివినుండి రపుడు రమణులతోడన్. 135

ఉ. అప్పటికిన్ ధరాసుత రయంబున దానవనాథమస్తముల్,
గుప్పునఁ గూలనేసె నవి గొబ్బున వెండియు మొల్చె
మొల్చినం, దప్పక మళ్లఁ దాఁ దునిమె దాకొని క్రమ్మఱ
మొల్చెఁ దా మటం, జప్పుడు గాకయుండ శితసాయక
ఘాటినిఁ గూల్చెఁ జెచ్చెరన్. 136

ఉ. ఖండలు సేయగా మొలవఁగాఁ దలకాయలు తండతండమై
కొండలరీతిఁ బ్రోవులయి కోరి మఱిన్ దివినోకి యిమ్మహీ
మండలమెల్ల నిండిన రమామణి జానకి చూచి యద్భుతా
ఖండవిచారియై యపుడు కాండము లేయక మానియాత్మలోన్.

చ. శిరములు ద్రుంచి వేసరితిఁ జేకొని చండతరాస్త్రకోటిచేఁ
గరములు ద్రుంచి వేసరితి కాండములున్ సరిపోయె దానవే
శ్వరుఁ డిలఁ గూలుటల్ మటోకటాడలు చొప్పడ వేమి
చోద్యమో, వరములసత్త్వమొక్కొ గెలువన్ వశమే
మిఁకయుఁ గాదిఁ కెట్లొకో. 138

చ. అని దనుజేంద్రుఁ దేసడికి రావలికిన్ హనుమంతువాల మొ
య్యన నరికట్టుచేసి మనుజాధిపు రాముని బల్కరించుచుం
దనమహిమంబు దివ్యులు ముదంబున సన్నుతిసేయుచుండఁగా
మనమునఁ జింతనొందఁగ రమారమణీసీతను గాంచి యాడకున్.

ఉ. శ్రీవరరాహిరాజతుహినాచలకారకశైలమల్లికా
శారదనీరదస్ఫురితచందనకుందనిభప్రభాంగుఁ డా
నారదఘంయమీంద్రుఁడు మనంబునఁ బొంగుచు సీతపాలికిన్
ధీరదయార్ద్రవృత్తిఁ జను దెంచె రఘూద్వహుఁ డుత్సహించఁగన్.

ఉ. సీతకు లోకమాతకు విశేషదయారసపోషితాశ్రిత
వ్రాతకు ధీసమేతకు శివస్తవభూతగుణౌఘశౌర్యవి
ఖ్యాతకు వీతభీతకు మహాతనుభాపరిభూతఖండఖ
ద్యోతకునున్న మస్కరణమొయ్యనఁ జేయుచుఁ డాసెఁడాసినన్.

ఉ. రాముఁడు నమ్మునీంద్రునకు రాజితబుద్ధి నమస్కరించి వీరా
రేమికతంబు నిచ్చటికి నెచ్చగుమచ్చిక నేగుదెంచి రు
ద్దామపరాక్రమంబొదవ దైత్యుఁడుపోరఁగఁజొచ్చెఘోరసం
గ్రామము మించె నిల్వనెడగల్గదు యేమటుచెప్పు మొప్పఁగన్.

చ. అనవిని మౌని గోప్యముగ నారఘురామునితోడ డాసి యి
ట్లను నకటా శతాస్యుని శరావళిచే నని నెంతపోరినం
దనరఁగ నేలఁ గూలుననె వృథాశ్రమ మింతియొకాక వీని గొ
బ్బునఁ దునియింపఁగా నుపమ బోరునఁజెప్పెదఁ జిత్తగింపుమా.

గీ. వీని నాభినిజుట్టురాఁ బూని యల వి
శల్యసంజీవకరణులు తుల్యముగను
గలిగియున్న వి తద్వస్తుఘనతఁ జేసి
తలలుఁ గరములుఁ దెగియును మొలవఁదొడఁగె. 144

గీ. బలిమి నటుగాన నాగ్నేయబాణ మేసి
తత్తదుగ్రావధులనెల్ల దగ్ధములుగఁ
జేసి బ్రహ్మాస్త్రమున నొండె పాసిగల్గు
శక్తిచే నొండె దైత్యుని సంహరింపు. 145

గీ. నెలఁత పోరంగ నుండుట నెపమటంచుఁ
దలఁపకుము సీతచేఁగాని దైత్యుఁ డణఁగఁ
డిట్టిగోప్యంబు జానకి కెఱుఁగఁ జెపుము
భామచేఁ గూల మున్ను శాపంబు గలదు. 146

సీ. అది యెటువలె నన్న నతిశీఘ్రవృత్తిమై
నెఱిఁగింతు వినుము మహీతలేశ
తనప్రధానులు గొల్వ దైత్యేంద్రుఁ డఖిలది
క్కులు గెల్వ నరిగె నుక్కునను దొల్లి
యరిగి సమస్తామరాదుల స్రుక్కించి
మరలివచ్చుచుఁ గణ్వమౌనివనముఁ
జొచ్చి కలంచుచో శోధించి యమ్ముని
కూరిమిపట్టినిఁ గోరి చూచి
గీ. పొలఁతిచక్కఁదనమున కద్భుతము నొంది
మదనచలితాంగుఁడై తాను మదినిఁ గలఁగి
యంతకంతకు విభ్రమాయత్తుఁ డగుచుఁ
జెలఁగి విమలాంగి యనుదానిఁ జేరి పలికె. 147

సీ. వనట నొందఁగనేల వరసౌధములఁ గల్గు
తూఁగుటుయ్యాలలందుఁ దూఁగరాదె
కందమూలము లేల కడుఘృతప్లుతముగా
మించు దేరఁగ భుజియించరాదె
నారచీరె లివేల సారమాణిక్యంపుఁ
బట్టుపుట్టంబులు గట్టరాదె
నేలవ్రాలగ నేల పూలపాన్పులపయి
లీల నాతోఁ బవ్వళింపరాదె
గీ. యేల ననుఁ జూడ వీవనం బేల యిట్టి
జోలెకాఁడైన తిరిపపుజోగి యేల
యఖిలలోకంబులకుఁ బతినైన నన్నుఁ
గదిసి వర్తింపఁ జెల్లదే కమలనయన. 148

[1]సీ. అన విని విమలాంగి యడలుచు నోరిదై
శౌర్యధను యిట్టివాక్యములు ధగునె
పరసతీజనములఁ బరధనంబులకుఁ దా
నాశించువారికి నాయు వణఁగు
గురుధర్మహానిరై నరకంబు సిద్ధించుఁ
జేసినపుణ్యముల్ చెడుఁ దలంప
మాతండ్రి కణ్వుఁ డీమాటలు విననేని
కది సీటు భస్మంబుగా శపించు
గీ. నోరి శావకమునఁ బరనారిఁ జెనకి
మడిసిపోయిన కుజనులమాట వినవె
పొమ్ము పొ మ్మింటి కిందు హాతమ్ముగాక
తరుణితో నేలయిట్టిమదంబు కుమతి. 149

వ. అని మఱియుం జతురోపాయంబుల ధర్మంబు దెలిపియు, మర్మంబు గలంచియు వెఱపించియుఁ బాటిగాదనియుం జెప్పి యతనితమకంబునకు భయం బంది నలుదిక్కులు బరికించుచు నుండ నుద్దండుం డగుశతముఖుండు గదిసి, సకలైశ్వర్య హీనుండగువేదతపసిం జెప్పి వెఱపించినం దలంకుదునే యని మదనకదనమునకు నొదవిన తహతహలఁ బలిమిమైఁ బైఁబడి పెనంగి శతముఖంబులఁ జుంబనంబులు గావించి యత్యంత ప్రయాసంబుగాఁ గూడిన నది సద్యోగర్భమై బాలకుం గని యమ్మహాదనుజాని దేహంబు తనపయింబడుటం జేసి తద్భరం బున శరీరంబు విడిచెఁ దదనంతరంబాకణ్వుండు సమిధల

1. దీని శమాఱుమాటలతో నీయర్థముగలపద్యములు రెండు ప్రత్యంతర ములలో నున్నది.

నిమిత్తంబున నరణ్యంబునకుఁ జనినవాఁడై తనపట్టి యొంటి
నున్న దని రయంబున వచ్చి యచ్చోట విహరించుచున్న శత
ముఖునిం గని భయంబునొంది పర్ణశాల కరుదెంచి అందు
శిశు వావు రని యొంటిఁ గనుంగొని యవ్వల శవంబై పడి
యున్న కన్యనవలోకించి *శోకించుచు దనతపోమహత్త్వం
బున నంతయుం దెలిసి కోపంబున శతకంఠునిం జేరి ఓరీ !
యిట్లు దుర్మదంబున నరుదెంచి నా పెంపుడుకూఁతు నిత్తెఱం
గున మానభంగంబు గావించి ప్రాణంబులుం గొనియున్న
వాఁడవు గాన నింతిచే నిట్లునీతలలు తునియలై మరణంబు
నొందఁ గల వని శపించె అంత శతముఖుండు నేడ చేడియలని
తనపురంబున కరిగె. అదియునుంగాక పరమేష్ఠిని వరంబులు

---

* తనమనంబున.

సీ. వసుఁజూడకె తల్లి నాయుద్ధరత్నమా నామందిరము చెప్ప రోఁమువారు
పురప్రసంఘాతంబుఁ బొల్పుమీఱఁగ మాతుఁ దెఱఁగొప్పు చెప్పరు తెప్పవారు
స్నానసంధ్యలయందు జపతపంబులయందు మమచారముల చెప్పరొసఁగువారు
దేవతార్చనవేళఁ బావనంబుగ నిష్టవస్తువు చెప్పరు వందువారు

గీ. అతిథి కభ్యాగతులఁ బూజ లందువారు
లెవరు దిక్కుగ నీవుఁ నిచట నుంచు
వారుఁగాఁ దనపట్టితపఃప్రపత్తి వోర్చి శోక
మూర్ఛనొందను పుత్రి పైఁ మోహమునను.

వ. ముకుతముఁ గొంతసేపునకు దెలిసి లేచి పొలసి ధూళిం గలసి యత్యంత
దుఃఖసాగరంబునం దేలి కొండొకసేపునకు ధైర్యం బవలంబించుకొని యా త్రైత
శరీరంబు దహించి విహితక్రమంబునఁ దిలోదకంబు లిడి శుచిహృదయుఁడై
క్రమంబుఁ బర్ణశాలకుఁ జని కొంతవిచారంబునొంది.

వేఁడునప్పుడు స్త్రీలచేతఁ జావు లేకుండ నడుగఁడయ్యె నిప్పుడు తచ్ఛాపం బనుకూలంబయ్యెఁ గావున నాదిపరం జ్యోతి యగుజానకిచే నవశ్యంబును గూలు నాలంబునకుం నీదేవిం బరికొల్పు మని హితోపదేశంబుచేసి యంతర్థానంబు నొందె రామచంద్రుండును బరమాశ్చర్యచిత్తుండై సీతకుఁ దద్వృత్తాంతంబంతయు నెఱిఁగించి యింక జాగుసేయక దను జానిం బరిమార్పు మని పురికొల్పిన నలరి భేరీమృదంగతూ ర్యాది నానావిధంబు లగువాద్యంబులు వినోదంబులుగా నఖిలభువనంబులును నిండ నుద్దండ ప్రచండభుజాదండంబునఁ గోదండంబంది యనలకల్పకాండపరంపరలేర్చి హయంబులం గూల్చి సారథిని వ్రాల్చి కేతనంబులు పొడిచేసి చక్రంబులు విక్రమంబున ఖండించి పలుక లలుకమై వ్రక్కలు గావించి మఱియును. 150

సీ. భండనోద్దండదండవేదండతుండ
చండకిరణప్రభాభాసమండలమున
గండుమీఱి శరంబులు గప్పుచున్నఁ
జేతులాడక యసుర నిశ్చేష్టుఁడయ్యె. 151

వ. మఱియు ననేకప్రకారంబుల జానకీప్రభావంబు గని శతా స్యుండు తనప్రభావం బాత్మలో నూహించి యేను సకల సుర గరుడోరగయక్ష కిన్నర గంధర్వ సిద్ధవిద్యాధరామ రేంద్రులకు నసాధ్యుండనై తిఁ గాని యీవిపరీతం బెన్నఁడు నెఱుంగనై తి నీవీరవనితచే మరణంబు నాకు నొందవలసెఁ గాని విరించివరంబులు వృథాస్థూలంబయ్యె నదియునుం గాక యీపావనప్రాదుర్భావంబున నిఖలదిశలం జని నాకెదిరిం

నిమిత్తంబున నరకార్యంబునకుఁ జనినవాఁడై తనపట్టి యొంటి
నున్న దని రయంబున వచ్చి యచ్చోట విహరించుచున్న శత
ముఖునిం గని భయంబునొంది పర్ణశాల కరుదెంచి అందు
శిశు వావు రని యొంటిలం గనుంగొని యవ్వల శవంబై పడి
యున్న కన్యనవలోకించి *శోకించుచు దనతపోమహత్త్వం
బున నంతయుం దెలిసి కోపంబున శతకంఠునిం జేరి ఓరీ !
యిట్లు దుర్మదంబున నరుదెంచి నా పెంపుడుకూఁతు నిత్తెఱం
గున మానభంగంబు గావించి ప్రాణంబులుం గొనియున్న
వాఁడవు గాన నింతిచే నిట్లునీతలలు తునియలై మరణంబు
నొందఁ గల వని శపించె అంత శతముఖుండు నేదచేడియలని
తనపురంబున కరిగె. అదియునుంగాక పరమేష్ఠిని వరంబులు

* తనమనంబున.

సీ. నముఁజాడవే తల్లి నాకుఁ దుర్గరక్ష్మమా నాకుందిరము చెవ్వ రోమువారు
ఫురవ్రరంఘాతంబుఁ బొల్పమిఁచుఁగ మాతుఁదెంఁగొప్ప చెవ్వరు తెద్పువారు
స్నానసంధ్యలయందుజపతపంబులయందు మమచారముల చెవ్వరొసఁగువారు
దేవతార్చనవేళఁ బావనంబుగ విష్ణుస్తవ చెవ్వరు సంతువారు
గీ. అతిథి కభ్యాగతికిఁ బూజ లందువారు
చెవరు దిక్కుగు నీవని నిచట నంచు
నొరఁగెఁ దనపట్టితనువృత్తై శోక్షిలేక
మూర్ఛనొందెను బుత్త్రికై మోహమునను.

వ. మునితనుఁ గొంతసేపునకు దెలిసి లేచి పొలసి ధూళిం గలసి యత్యంత
దుఃఖసాగరంబునం దేలి కొండొక సేపునకు ధైర్యం బవలంబించుకొని యాస్త్రీత
శరీరంబు దహించి విహితక్రమంబునఁ దిలోదకంబు లిడి శుచిస్నాతుఁడై
క్రమ్మఱఁ బర్ణశాలకుం జని కొంతవిచారంబునొందె.

కేఁడునప్పుడు స్త్రీలచేతఁ జావు లేకుండ వడుగఁడయ్యె
నిప్పుడు తద్వ్యాపారం బనుకూలంబయ్యెఁ గావున నాదిపరం
జ్యోతి యగుజానకిచే నవశ్యంబును గూలు నాలంబునకుం
నీదేవిం బురికొల్పు మని హితోపదేశంబుచేసి యంతర్ధానంబు
నొందె రామచంద్రుండును బరమాశ్చర్యచిత్తుండై సీతకుఁ
దద్వృత్తాంతంబంతయు నెఱింగించి యింక జాగుసేయక దను
జానిం బరిమార్పు మని పురికొల్పిన నలరి భేరీమృదంగతూ
ర్యాది నానావిధంబు లగువాద్యంబులు వినోదంబులుగా
నఖిలభువనంబులును నిండ నుద్దండప్రచండభుజాదండంబునఁ
గోదండంబంది యనలకల్పకాండపరంపర లేర్చి హయంబులం
గూల్చి సారథిని వ్రాల్చి కేతనంబులు పొడిచేసి చక్రంబులు
విక్రమంబున ఖండించి పలుక లలుకమై వ్రక్కలు గావించి
మఱియును. 150

గీ. ఖండనోద్దండదండవేదండతుండ
చండకిరణప్రభాభావామండలమున
గండుమీఱి శరంబులు గప్పుచున్నఁ
జేతులాడక యసుర నిశ్చేష్టుఁడయ్యె. 151

వ. మఱియు ననేకప్రకారంబుల జానకీప్రభావంబు గని శతా
స్యుండు తనప్రభావం బాత్మలో నూహించి యేను సకల
సుర గరుడోరగ యక్ష కిన్నర గంధర్వ సిద్ధవిద్యాధరామ
రేంద్రులకు నసాధ్యుండనైతిఁ గాని యీవిపరీతం బెన్నఁడు
నెఱుంగనైతి నీవీరవనితచే మరణంబు నాకు నొందవలసెఁ
గాని విరించివరంబులు వృథాస్థూలంబయ్యె నదియునుం
గాక యావనప్రాదుర్భావంబున నిఖిలదిశలం బని నాకెదిరిం

చినశత్రులందునిమి మిత్రుల నాదరించి సకలమహోత్సాహం
బునం బురంబున కరుదెంచుసమయంబునఁ గణ్వవనంబున
కరుగుదెంచి కామాంధత్వంబున మునిపుత్రికతో విహరించిన
...తాపసుండు...ఇంతిచే మరణంబు నొందఁగలవాఁడవని
శపించె నని ప్రధాని సుబుద్ధితో నని జానకిదెసం జూచి
యివ్విధంబున నాదిమశక్తి యైన దీనిచేత మరణంబుగలుగుట
మహాపుణ్యలోకంబు గల దని ధైర్యం బవలంబించి యెదు
ర్కొనె నంత. 152

చ. బలువిడిఁ గర్కశక్రకచభల్లశతం బరివోసి వానిచే
తులుఁ దలలుం ధరాస్థలిని దోడనె గూల్చి శరీరమెల్ల వ్ర
క్కలుగ నొనర్చి యార్చినను గర్వముదూలి వశంబుగాక చం
చలముననున్నఁగాంచియలజానకియుగ్రత మిన్నుముట్టుచున్.

మ. అనలాస్త్రం బరివోసి యేసె నది హాహాకార మొప్పంగఁ జ
య్యన జీవంబులు సంహరించుచు మహాశ్చర్యంబుగా వానినా
ఖినిఁ దాముండు మహౌషధీలతలు నాభీలంబుగాఁ గాల్చి గొ
బ్బున భస్మంబుగఁజేసివచ్చెను సురల్ భూషింపఁగాఁ జెచ్చెరన్.

శా. బ్రహ్మాస్త్రం బరివోసి దిక్కుటము లభ్రంబుగా వేసన్నిండఁగన్
బ్రహ్మాండంబు వణంక నద్రులు చలింపంగా విరుల్ మీఁటి సా
బ్రహ్మేంద్రాదులు దల్లడిల్ల శివుఁ డోపంజాల నంచుం బర
బ్రహ్మంబుగా వినుతింప సీత బలశుంభద్వ్యక్తిమైనార్చుచున్.

గీ. అవనిపై నే పతివ్రత నైతినేని
యరయ రాముండు ధర్మాత్ముఁ డయ్యెనేని
వేదములు సత్యములునేని వీఁడు నిమ్మ
శాస్త్రమున దగ్ధుఁ డగుఁగాక యనుచు నేసె. 156

గీ. అప్పు డాదివ్యసాయక మతిరయమునఁ
జిచ్చు లీనుచుఁ జని వానిచేతులెల్లఁ
ద్రుంచి రౌఖకతలచిక్కఁ దుందుడుకు మెఱసి
కడమతలలెల్లఁ దృణలీలఁ బడమిఁ గూల్చె. 157

చ. మఱియును శత్రువైవ నది మండుచు శీఘ్రత నేగి దేహ మ
బ్బురముగఁ జించి యున్నతల బోరునఁ గూల్చిన ద్రుంగి యు
మ్మహా, సురవరుఁడు గ్రవజ్రమునఁ జోద్యముగాఁ బడుగొండ
వోలె ని, ద్ధరఁ బడెఁ దద్భరంబునకుఁ దల్లడమందె ఫణీంద్రుఁ
డత్తఱిన్. 158

సీ. అప్పుడు గురియించి రమరులు కుసుమంబు
లప్పుడు విమలంబు లయ్యె దిశలు
నప్పుడు తగనాడి రప్సరాంగనలెల్ల
నప్పుడు రవిచంద్రు లలరుచుండి
రప్పుడుచేసె సింహధ్వాన మాసీత
యప్పుడు రాముండు హర్ష మొందె
నప్పుడు నారదాద్యఖిలతాపసులును
జరుదెంచి రచటికి సుభ్రమముల

గీ. జానకీదేవియును రాముచరణములకు
నొరఁగి నొరఁగిన నక్కున నొనరఁ జేర్చి
నీకతంబున వైరంబు నేఁడువాసెఁ
గంటిఁ గీర్తు లటంచు నక్కడఁ జెలంగె. 159

గీ. పరమకల్యాణి శాంభవీ పద్మనేత్ర
నీప్రతాపంబు సత్కీర్తి నెగడఁదరమె

యనుచు నుతియించి సురవరు లానసంగఁ
గడుముదంబునఁ బరమేష్ఠి పుడమిసుతను. 160

ఉ. శంకలు మాని యబ్జజుఁడు జానకిపాలికి నేగుదెంచుచోఁ
బొంకముగా నుతించి మఱిగోరున నొక్కవరంబు వేఁడుమో
పంకజనేత్ర యన్నఁ దనభర్త యనుజ్ఞను జేసి వారితో
నుంకువమీఱ నిట్లనిరొ నుల్లమునన్ ముదమందుచున్ వెసన్.

క. మాకొఱకు నఖిలనృపతులు
దాకొని సైన్యములువచ్చి దైత్యునిచేతం
బ్రాకటముగఁ బడి రిటు మీ
రేకంబుగ వారినెల్ల నిందు ముదమునన్. 162

ఉ. వారల నిచ్చి పెండియును వారిజనేత్రను గోరుమన్న గం
భీరతఁ బొంగి వానరవిభీషణసైనికులన్ మఱిందులన్
వారకపుత్రపౌత్రులను వైళమునన్ బ్రతికింపుఁ డంచు వి
స్తారమ్ముదార్తి వేఁడినను జయ్యన నిచ్చిరి దేవసంఘముల్.

చ. సకలధరాధినాథులును సైన్యములున్ భరతాదిసోదరుల్
సకలకుమారకుల్ దనుజసంఘములుం బటువిక్రమోజ్జ్వల
ప్రకటశరీరులై మనిన బాగుగ దేవతలెల్ల వారిపై
సుకరముగాఁ గురించి రతిచోద్యముగానమృతంపువర్షముల్.[1]

గీ. అంత హతశేషులైనవా రాశరాస్య
మరణ మెఱిఁగింప మూర్ఛిల్లి మహిని వ్రాలి
కెలిని యాచిత్రగంధి యొత్తిలి విలాప
మొందవఁ గోడండ్రు తనవెంట నొఱల వెడలి. 165

1. దీనికి వైమాఁకుపద్యములకును పదకము గలదు.

గీ. కదన మంతయుఁ జూచుచుఁ గదలివచ్చి
తలలు దివిసోఁకఁగా బడి వెలయుకొండ
వలెను గూలినతనయు నవార్యలోక
కంటకుం డైనయాశతకంఠుఁ గనియె. 166

వ. కని యనేకప్రకారంబులఁ గోడండ్రును దానును నతని పయింబడి మోదుకొనుచు నేలలు దడుపుచుఁ దమకు దిక్కేది యనుచు సీతను దూఱుచు బాష్పంబులు రాల్చుచు విలపించి మఱియును బుత్రశోకంబును దరింపఁజాలక ఱొమ్మును శిరంబును మోదుకొనుచుఁ జిత్రగంధి యిట్లనియె.

సీ. సురవర్గములనెల్లఁ జెఱలువట్టిన నీమ
హోజ్జ దా నెచ్చట నణఁగెఁ దండ్రి
దిక్కరిఘటముల ద్రక్కలుగావించు
నీభుజాబలము యేనీటఁ గలసె
వెంగమొత్తి కనుఁగొని ముక్కంటినైనను
వెఱపించులావు నేవీటఁ బోయె
నీతపంబునకు విధాతృఁ డిచ్చినయట్టి
వరములమహిమ యేవఱదఁ గలసె
గీ. వెలయ రాఘవుఁ డాదిమవిష్ణుఁ డంటి
సుదతి జానకి యప్పరంజ్యోతి యంటి
గపులు సుర లంటి జయములు గలుగవంటి
సకట వినవైతి వేమందుఁ దనయ. 163

గీ. రాఘవుని జంపి జానకీరమణి కీవు
తలఁతు వెప్పుడు మదిని వైధవ్య మొదవ

నది మృషావాదమై నీనిజాంగనలకు
నహహా వైధవ్య మొదవె నటంచు మఱియు. 169

ఉ. రా యనుఁ బోకుమంటిఁ గదరా యను నిన్నికఁ గాని
మోర్వలే,రా యను హా లోకతద్వ్యయకరా యను మమ్మిటు
బాధపెట్టితే, రా యను నీతనూజుఁ గనరా యను నెక్కడఁ
గందురా కుమా,రా యను నల్గనేల వినరా యను హా శత
కంధరా యనున్. 170

వ. ఇట్లు విలపించుచున్న దనుజసతి యయ్యాతి పతికళేబరంబున
వ్రాలి సోలి మూర్ఛిల్లి మెల్లనఁ దెలిసి హా ప్రాణనాథ! హా
శతాస్య! హాబలపరాక్రమ! చెడితి ధూళిఁ గలిసితి నీకుమా
రునిఁ జూడవేమి నాతోఁ బలుకవేమి లెమ్ము లెమ్మని కరంబుల
శరీరస్పర్శచేయుచు ఱొమ్ము గ్రుద్దుకొనుచు సీతనుజూచి పురు
షుల వధియింపంబూని నీవిట్టిజన్మంబు నొందితివి పాపాత్ము
రాల వదియునుంగాక యిట్టిపాపానురాలవు కాకుంటివేని
నానాథుండు నిష్కారణంబున వహ్నికుండంబునం బ్రవేశిం
పంబెట్టిన యప్రమాణవర్తినివి మనబుద్ధులు ప్రళయాంత
గంబులని లోకంబునఁ బ్రశస్తంబయ్యె నిన్ననఁ బనియేమి
నాఫలంబు నే నిట్టిదురవస్థఁ బొందితి ననుచు సంతాపించి
మఱియును. 171

ఉ. మాయను మోసపెట్టితివి మాయురె నీ కిది ధర్మమౌనె రా
మాయను నయ్యె నాదుఫలమా యనుదానవలోకసార్వభౌ
మాయను డాయ వింతచలమా యను నేఁటికిఁ జేసితింత ఘా
మాయను దుర్లభంబులను మాయను కాపురి దైవమా
యనున్. 172

గీ. అనుచు నొఱలంగ వారల ననునయించి
రాముఁ డిట్లనె నేల విలాపమొంద
నాహవంబున నెచట జయాపజయము
లందఱకుఁగల విధము నిత్యంబు గాదు. 173

వ. చిత్రగంధిం జూచి. 174

క. కులవృద్ధవు గుణవృద్ధవు
నెలకొని విలపింపఁదగునె నినుబోటులకుఁ
దలులకు సద్ధర్మిణులకు
గులకుల మని యేడ్వఁదగునె గుణధీరులకున్. 175

గీ. ఎవ్వఁ డనిలోన నాతోడ నిట్లుపోరె
నెవ్వఁ డనిలోన మాచేత నిట్లుగూలెఁ
జెల్లు నితనికి రణమున విల్లుపూన
నరయ నెన్నిటనైనఁ గృతార్థుఁ డితఁడు. 176

గీ. రావణునికన్న వీఁడు పరాక్రముండె
యెఱుఁగవా రాముబాణాగ్ని ధరణిఁ గూలెఁ
బార్థివులతోడ నెదిరింపఁ బాటిగాదు
ఎంత బలవంతుఁ డీబలవంతు నెదుర. 177

వ. అనుచు విభీషణుండు పలికినఁ జిత్రగంధి దుఃఖావేశంబున నిట్లనియె. 178

చ. వినుము చలంబుపట్టి నృపవీరుని ప్రాపునఁ జేరి నీకులం
బును దగఁ బోఁజేసిన యపూజ్యుఁడవై తగియుండి ముమ్ములం
దునియలు చేయఁజేసితివి దోసమె నీవును నీకుమారులుఁ
వినయముతోడ నుండఁ బడిపోలుసువిూ వినవో విభీషణా.

గీ. అనుచు నీరీతి వడలుచు నప్పు డుండ
హనుమదాఖ్యుండు చనుదెంచి యచటివారిఁ
దోడుకొనిపోయి దుఃఖంబు దొలఁగఁజేసి
జానకీపతి యావిభీషణునిఁ జూచి. 180

వ. ఈశతాస్యునకుఁ బరలోకక్రియలు చేయింపుము. 181

గీ. అని విభీషణుఁ బంపించి యగ్నివిధులు
సలుప నియమించి తీరినసమయమందు
నాశతాస్యునితనయు మహాగుణాఢ్యు
నీలకేతనుఁ డనువాని నృపుఁడు కృపను. 182

గీ. దంబుగా నప్పురికిని బట్టంబు గట్టి
పెక్కుభంగుల దీవించి ప్రేమ నిగుడ
రమణ నగణితతూర్యనాదములు మ్రోయ
మతివరుం డరుదెంచె దేవతలకడకు. 183

చ. సురలును మానులుఁగ నృపులు శోభిల దీవన లిచ్చి మెచ్చుచో
నరిగిరి రాముఁడుం బటురయంబున మారుతిఁ జూచి క్రమ్మఱన్
శరధులు దాఁటఁజేయు మని చయ్యన వేఁడిన వాయుజుండు చె
చ్చెరఁ దనతోఁకపై నడపె సేనల నందఱి నొక్కపెట్టునన్.

ఉ. తమ్ములు, దాను సీతయును దానవమానవవానరాళియుఁ
సమ్మదలీల నశ్వములఁ జారుమదేభరథాదులింపుమై
గ్రమ్ముకొనంగ నెక్కి శతకంఠమహోగ్రవధాప్రకారముల్
పేర్మిఁగ నుగ్గడించుచు విభీషణభానుజు లుత్సహింపఁగన్. 185

ఉ. మారుతనందనుండును గ్రమంబున సేనలు గొల్వఁగా నయో
ధ్యానగరంబుఁ జేరి తనతల్లులఁ గాంచి నమస్కరించి య

జ్జానకిచేయుపౌరుషము సర్వముఁ జెప్పి సుమంత్రమంత్రు లా
ప్తా నని సన్నుతింప ముదమార విభీషణుఁ బిల్చి యిట్లనున్.

చ. పెనఁగితి వాలమందునను బెక్కువిధంబులఁ జాలఁజాల నా
మనసునవచ్చె నీదు మహిమావిజయంబు లటంచు మెచ్చి స
త్కనకవిభూషణాంబరనికాయ మొసంగి ముదంబుమీఱ నం
పినఁ దనసేనతోడుత విభీషణుఁడుం జనె నంత నత్తఱిన్.

చ. రవితనయాంగదాదులను రమ్మని కౌఁగిటఁజేర్చి మీకృపా
ప్రవిమలదృష్టిచేసి నగుబాటు ఘటింపకయుండ దైత్యునిన్
భువి నడఁగింపఁగాఁగలిగెఁ బోరున నంచు నమూల్యవస్తువుల్
సువినయవృత్తిమైనొసఁగి చయ్యనఁ బంపెదయామనస్కుఁడై.

చ. సకలధరాధినాథులను సంభ్రమ మొప్పఁగఁ బిల్చి సూనృత
ప్రకటతరోక్తులన్ వివిధభంగుల నాదరణంబుచేసి వా
రక సెలవిచ్చిన న్నృపులు రామునకుం దగమ్రొక్కి తాముద
ప్పక బలమెల్లఁ గొల్వఁగ నపారరణక్రియ లుగ్గడించుచున్.

చ. పిదప మరుత్సుతున్ సమరభీషణు నీతిగుణౌఘభూషణున్
సదమలభూషణుం బిలిచి సారెకుఁ గౌఁగిటఁజేర్చి ప్రీతి దు
ష్కదనధురీణ! శత్రుమదఖండన! నీమహిమంబుచేఁ జుమీ
యదవద వాసి దైత్యుని శరావళిచే నణఁగించి మించుటల్.

ఉ. నీమదిలోనికోరికలు నిక్కమెఱుంగుదు నెన్నిభంగులన్
నేమముగా నొనర్తు నది నే నిఁక నమ్ము మటంచు సీతయున్
రాముఁడు నిచ్చెఁగోర్కులపరంపరలున్ మణిభూషణంబులున్
వేమఱువాయుజుండును వివేకము మీఱఁగ మ్రొక్కి గ్రక్కునన్.

చ. మనుజవరేణ్యు చేతఁ బలుమాఱును దీవన లంది గంధమా
దనమున కేగె రాముఁడును దమ్ములుమంత్రులు బంధుమిత్రులున్
ఘనముగ నుత్సహింప నతిగౌరవ మొప్పఁగ రాజ్యభార మొ
య్యన వెసఁ దీర్చుచుండెఁ గరుణాయుతసాంద్ర మనస్కుఁడై
తగన్. 192

ఉ. ఎవ్వరు నీకథం జదివి యిష్టగ వ్రాతురు ధర్మబుద్ధిమై
నెవ్వరు విందు రట్టిసువివేకులకున్ రఘునాథుఁ డిచ్చు నా
యువ్వపుభోగభాగ్యములు మానితసౌఖ్యము లిష్టసంపదల్
నివ్వటిలం బ్రియంబులుకు నీరజసంభవసన్నిభాయువుల్. 193

వ. అని యివ్విధంబున శంకరుం డెఱింగించిన శాంకరీదేవి మహా
ద్భుతంబు నొంది మహాత్మా ! యిట్టిచమత్కారకథావిధానం
బెన్నండును విని యెఱుంగను నేఁడు శ్రవణానందంబుగా
వినఁగలిగెఁ గృతార్థురాలనైతి ననని యానందించుచుండె
నంత. 194

ఉ. శ్రీరమణీయవైభవ ! విశేషగుణాకర ! దీనలోకమం
దార ! గభీర ! ధీర ! సముదార ! సుకీర్తివిహార ! శత్రుసం
హార ! యఘుప్రహార ! సదయానుశరీర ! సుధాకరప్రభా
కార ! లసద్విచార ! జయకారణ ! పోచమరెడ్డి భూవరా !.

మాలిని. ప్రవిమలగుణహారా ! బంధురాఘౌఘదూరా !
వివిధశుభవిచారా ! విశ్రుతాచార ! ధీరా !
కవిజలరుహసూరా ! గర్వదుర్వారదూరా !
భువనహితశరీరా ! పోచమశ్రీవిహారా !. 196

గద్యము. ఇది శ్రీమదేయకూర్తినివాస లక్ష్మీనృసింహ కరుణా
కటాక్షసంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ సుమహితాంధ్ర
గీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రా
త్రేయసగోత్రపవిత్ర ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురా
శీర్వాద ప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ మర్దనరాఘు
ధేయ ప్రణీతంబైన సీతావిజయం బను మహాప్రబంధంబు
నందు సర్వంబును చతుర్థాశ్వాసము సంపూర్ణము.

సీతావిజయం బను శతకంఠరామాయణము

సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | ... | 2 | 0 |
| పాండురంగమాహాత్మ్యము, తెనాలిరామకృష్ణకవి, సటీక | ... | 6 | ౬ |
| బిల్హణీయము, చిత్రకవిసింగనార్యకవి | ... | 1 | 4 |
| భారతసావిత్రి | ... | 0 | 2 |
| భోగినీదండకము, బమ్మెర పోతన | ... | 0 | 2 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 4 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 5 | 0 |
| మొల్లరామాయణము, ఆతుకూరి మొల్ల విరచితము | ... | 1 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 6 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 8 |
| రాధికాసాంత్వనము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 8 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 1 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 2 | 0 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 12 |
| వాయుపురాణము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| విజయవిలాసము | ... | 1 | 8 |
| డిటో టీకాతాత్పర్యము | ... | 3 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1872, మద్రాసు. 1.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కాంతి పత్రికము | ... | 7 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో (బ్రౌనుపేరు) | ... | 0 | 10 |
| ఆంగ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలితో | ... | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | 15 | 0 |
| 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 8 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనిబైండు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | | అచ్చు | |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 0 | 12 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కిన్నరీవిజయము - ఆదిపూడిసోమనాథరావు | ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 10 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము. | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |

Not to be issued

| | ప్రతి 1-కి రూ. అ. |
|---|---|
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది ... | 0 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జి. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 |
| " గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 1 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు ... | 0 |
| గణికాగుణప్రవర్తనతారావళి ... | 0 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము ... | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... | 1 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 |
| చెన్నపురీవిలాసము ... | 0 |
| చెన్నబసవపురాణము, అత్తలూరి పాపకవి .. | 1 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) ... | 2 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి ... | 2 |
| తెలుగుసమస్యలు ... | 0 |
| దశావతారచరిత్ర, ధరణిదేవుల రామయమంత్రి . . | 4 |
| దసరాపద్యములు ... | 0 |
| ధనాభిరామము, నూతనకవి సూరనకృతము ... | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) .. | 0 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకారసంగ్రహము) | 3 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము, క్యాలికో బైండు ... | 2 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనప్రణీతము ... | 2 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది ... | 2 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 2 |
| డిటో వేంకటనాథరాజకవికృతము ... | 2 |
| పేరిణీపద్యములు ... | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.